# నిజం

ఆరు అంకాల నాటకం

రచయిత:
రాచకొండ విశ్వనాథ శాస్త్రి

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 4.

ప్రచురణ నెం : 468.
ప్రథమ ముద్రణ :
1962 సెప్టెంబరు.

వెల : రు. 2.00



ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ - 4.



## అంకితం

గురజాడ కళాకేంద్రం సభ్యులకి

# రచయిత మనవి

నేను మొదట కథలు రాసినప్పుడు సరదాకోసమూ గొప్పకోసమూతప్ప మరెందుగురించీ రాయలేదు. మనం కూడా కథలు రాసేం, అవి పత్రికల్లో పడ్డాయి – అంతే నాకు చెడ్డగొప్పగా ఉండేది. కాని రానురాను ఆ పంథా మారిపోయింది. వయసుతో పాటు అనుభవంతో పాటు మనసుకూడా మారుతుందను కుంటాను. ఈ నాటకం నేను నా గొప్పకి కాని నాకు ఊసుపోకకాని రాసిందికాదు. ఇందులో జరిగిన అన్యాయాలవంటి అన్యాయాలు నిజజీవితంలో అదే స్థాయిలో నిత్యం జరక్కపోయినా ఏదోఒక స్థాయిలో మాత్రం నిత్యం జరుగుతూనే ఉన్నాయి. ప్రస్తుతం మనదేశంలో ప్రతిరోజూ ప్రతిచోటా కూడా ఎందరో కొందరమాయకులు వాళ్లు చెయ్యని నేరాలకి శిక్షలనుభవించడం జరుగుతోందని నేను ఖచ్చితంగా, ఘంటాపథంగా, ఛాలెంజిచేసి చెప్పగలను. కాని, ఆ మాత్రం ఈ మాత్రం డబ్బూ పలుకుబడీ, పదవీ, హోదా కలవాడెవడూ మాత్రం ఆ పరిస్థితుల్లో పడ్డు, ఇరుక్కోడు; ఒకవేళ, పడినా ఇరుక్కున్నా పైకి తప్పించుకోగలడు. మరైతే ఆ విధంగా అన్యాయానికి గురి అవుతున్నదెవరు? "మిగతా అలగాజనం!" ఆ విధంగా అన్యాయానికి గురవుతున్నది వాళ్లు. వాళ్లగురించే "దీనులు, హీనులు, పతితులు, భ్రష్టులు, బానిసలు, పీడితులు" అనిచెప్పి కవులు రిఫర్ చేస్తూంటారు. వాళ్లు ఉన్నారనే విషయాన్ని పెద్దలంతా వప్పుకుంటారు. వాళ్లని ఉద్ధరించవలసిన ఆవశ్యకత ఉన్నదనికూడా వప్పుకుంటారు. కాని వాళ్లని బాగుచెయ్యడం కోసం పెద్దలెవరూ ఏమీ చెయ్యడం మాత్రం కనిపించదు. లంచాలు జేబుల్లోకి వెళ్తున్నాయి; లాభాలు బ్యాంకుల్లోకి వెళ్తున్నాయి; రాజకీయ

వేత్తలు ఖద్దరుబట్టలు తొడుక్కొని పార్లమెంటుకి వెళ్తున్నారు. దేశంలో అందర్నీ ఉద్ధరించడానికి ఆర్థిక మంత్రులు కోట్లమీద అప్పుకోసం ప్రతిదేశానికీ వెళ్తున్నారు; దేముడుచెప్పిన న్యాయాన్ని నిలబెట్టేందుకు స్వాములూ, మౌల్వీలూ, బిషప్పులూ రోజూ ఉపన్యాసాలకి వెళ్తు న్నారు. కాని ఏ పాపం ఎరగని వాళ్లుమాత్రం జెయిళ్లలోనూ జెయిళ్ల బైటాకూడా మగ్గుతూనే ఉన్నారు; పాపంలా పెరిగిన పెద్దవారు ఎన్ని పాపాలుచేసినా వారే పెద్దవారుగా ప్రభువులుగా ఉంటున్నారు. ఈ పరిస్థితుల్లో ఈ సంఘంలో పేదవాడికి న్యాయం దొరకదు. కాక దొరకదు. తన కన్యాయం జరిగితే ఎదుర్కొందికి పేదవాడి కీ సంఘంలో అవకాశం లేదు కాక లేదు. ఈ పరిస్థితి మారాలని నా కుంది. అందుకే ఈ నాటకం రాసేను.

రాచకొండ విశ్వనాథ శాస్త్రి

21 - 9 - '62

***

# పాత్రలు

సత్యం : 'లా' చదువుతున్నాడు. వయసు: ఇరవైపైన పాతిక లోపు.

సుందరరావు : సార్వభౌమరావుగారి కొడుకు. ఆర్మీలో ఆఫీసర్‌గా ఉన్నాడు. సత్యంకంటె రెండేళ్లు పెద్ద.

మధుసూదనరావు : పాలిటిక్స్ ఆనర్స్ ఆఖరి ఏడాది చదువుతున్నాడు. వయసు సత్యం వయసే ఉంటుంది.

కృష్ణారావు : మధుసూదనరావు క్లాసుమేటు. అదే వయసు.

సుశీల : సార్వభౌమరావుగారి ఇంట్లో ఉంటుంది. అతనికీ, ఈమెకీ సబంధం ఉందని అందరికీ తెలియదు. అతని (చనిపోయిన) వంటమనిషి కూతురు. చాలా అందంగా ఉంటుంది. పాతికేళ్లుంటాయి.

సోమసుందరరావు : పాతిక సంవత్సరాలుంటాయి. స్టూడెంటు కుర్రవాళ్లా ఉంటాడు; కాని కాడు. దిక్కూ మొక్కూ లేరు. ఊళ్లో జులాయిగా బేవార్సుగా రౌడీగా తిరుగుతూ ఉంటాడు. చదువుకున్న జులాయి వాళ్లతో కలిసిమెలిసి ఉంటాడు. చదువుకోలేదు' గాని, మాట్లాడ్డం, దాదాపు, చదువుకున్న వాళ్లలాగే మాటాడతాడు.

సార్వభౌమరావు : పార్లమెంటు మెంబరు, పవర్‌ఫుల్ మనిషి, చూడ్డానికి డాబుగా గంభీరంగా ఉంటాడు. సుశీలని విడవలేదు. యాభయ్యేళ్ల వయసుంటుంది, బలంగా ఉంటాడు.



కిష్టప్ప : పోలీసు సబ్ ఇనస్పెక్టరు. ముప్ఫయ్యేళ్లుంటాయి.

జడ్జి : సెషన్స్ జడ్జి, యాభయ్యేళ్ల వయసు, తను తెలివైనవాణ్ణని తెలిసినవాళ్లా ఉంటాడు. హైకోర్టు జడ్జిగా ప్రమోషన్ వస్తుందని ఆశ పెట్టుకున్నవాడు.

బెంచిగుమస్తా : బక్కగా ఉంటాడు.

ప్రాసిక్యూటరు : నలభై అయిదేళ్లుంటాయి. "నీకు కనికరం లేదుస్మా" అని అతన్తోచెప్తే ఆశ్చర్య పోతాడు.

డిఫెన్స్ లాయరు : ముసలివాడు. "ఈరోజుల్లో న్యాయానికి నిలబడి లాభంలేదని" తెలుసుకున్నవాడు.

కోర్టు బంట్రోతు : గా చాలాకాలంనుంచీ ఉన్నాడు.

[స్టెనోగ్రాఫరు : ముక్తసరి మనిషి. మెకానికల్ మనిషి, బక్కగా ఉండడు.

డాక్టరు : ఏ వయసు వాడైనా కావచ్చు, పాతికదాటేక.]

వీరుకాక, జెయిలు సూపరెంటూ, జిల్లా మెడికల్ ఆఫీసరూ, జెయిలు డాక్టరూ, మేజిస్ట్రేటూ, ఇద్దరు రిజర్వుపోలీసులూ (తుపాకులతో, వాటిమీద బాకులతో సహా), జెయిలు వార్డర్లిద్దరూ, కోర్టులో ప్రాసిక్యూషన్ సాక్ష్యం విని అదంతా మిగిలిన సాక్షులకి అందివ్వడానికి ఇద్దరు చారులూ, కొంతమంది లాయర్లూ, పౌరులూ – వగైరా పాత్రలుంటాయి.

(ఈ నాటకంలో పాత్రలన్నీ కల్పితాలు. నిజ జీవితంలో ఎవర్నీ ఉద్దేశించినవి కావు.)



## ఈ నాటకం ప్రదర్శించాలంటే :

కొంత తగ్గించుకోవలసుంటుంది. అలా తగ్గించుకోవలసిన భాగాలు దీని తరవాత పేజీలో సూచించడం అయింది. ఆ ప్రకారం అయినట్లయితే మూడో అంకం పూర్తిగా తీసేయడం అవుతుంది. అవకాశం ఉన్న సమాజాలవారు అదికూడా ప్రదర్శించుకోవచ్చు.

ఈ నాటకంలో ఎక్కువ పాత్రలున్నాయి. అయితే, మొదటి సీనులో కనిపించే సత్యం ఆసీను తరవాత తిరిగిరాడు. అదేవిధంగా సుందర్రావు కూడా రెండో అంకం మధ్యలో వెళ్లిపోయి మరి కనిపించడు. ఆయా వేషాలు వేసేవారు అటు తరువాత సీనుల్లో వేరే వేషాలు– జడ్జీగా, ప్రాసిక్యూటర్‌గా, లేక డిఫెన్స్ లాయర్‌గా – వేయడానికి వీలుంటుంది. అదే మాదిరిగా [మూడు] నాలుగు అంకాల్లో వచ్చే రిజర్వు పోలీసువారు ఆఖరి సీన్లో జెయిలు వార్డర్లుగా మారొచ్చు.

రెండో సీనులో గోడగడియారం ఉంచినట్లయితే, ఆ గడియారం, సోమసుందర్రావుని సార్వభౌమరావు చెప్పిన ప్రకారం పక్కగదిలో పెట్టి సుశీల గడియవేసిన సమయానికి – సరిగ్గా ఆ సమయానికే పన్నెండు గంటలు కొట్టాలి. ఆ సీను మొదలు పెట్టిందగ్గర్నించి సరిగ్గా ఆ క్షణం వచ్చేవరకూ ఎంత టైం పడుతుందనేది రిహార్సల్స్‌లో చూసుకోవలసుంటుంది. కుదరదేమోననే అనుమానం ఉంటే ఆ సీన్లో గడియారం ఉంచకపోడం మెరుగు.

కేసు విచారణ సీనుల్లో కోర్టుహాలు జనంతో (ముఖ్యంగా స్టూడెంట్స్‌తో) కిటకిటలాడుతున్నట్టు చూపించ గలుగుతే బావుంటుంది. ముందుగా చెప్పి ఆడిటోరియంలో ఉన్నవారిని కొంతమందిని అప్పుడు స్టేజిమీదికి రప్పించుకోవచ్చు.

***

8

# ప్రదర్శనకు తగ్గించుకోవలసిన భాగాలు

## స్టెనోగ్రాఫరు, డాక్టరుపాత్రలు

పేజీ 9 : 7 వ పంక్తినుండి 10 వ పేజీలో 11 వ పంక్తివరకు.

పేజీ 11 : 12 వ పంక్తినుండి 12 వ పేజీలో 12 వ పంక్తివరకు.

పేజీ 14 : 23 వ పంక్తినుండి 15 వ పేజీలో 14 వ పంక్తివరకు.

పేజీ 20 : 28 వ పంక్తినుండి 23 వ పేజీలో 2 వ పంక్తివరకు.

పేజీ 23 : చివరి పంక్తినుండి 24 వ పేజీలో మొదటి పంక్తివరకు.

పేజీ 24 : 2 వ పంక్తిలో "మిస్టర్ మధూ ... ... అన్నావు''; "ఇష్టం లేదన్నావ్''.

పేజీ 25 : 3 వ పంక్తినుండి 6 వ పంక్తివరకు.

పేజీ 25 : 7 వ పంక్తిలో "ఇంతకీ మాలతెవరు ?".

పేజీ 86–120 : 3 వ అంకం అంతా.

పేజీ 139 : క్రిందినుండి 3 వ పంక్తిలో "దానికొడుక్కి ..." నుండి 140 వ పేజీ 5 వ పంక్తిలో "వచ్చేడు" వరకు.

పేజీ 143 : క్రిందినుండి 6 వ పంక్తిలో ''కాని నన్నాయన ..." నుండి 3 వ పంక్తిలో "అవును" వరకు.

పేజీ 143 : చివరి రెండు పంక్తులు.

పేజీ 148 : క్రింది నుండి 3 వపంక్తిలో "అతను కనిపిస్తే ..." నుండి 149 వ పేజీ 2 వ పంక్తిలో "కిత కితలుపెట్టేవి" వరకు.

పేజీ 149 : 16 వ పంక్తిలో "నా నేరాలు ..." నుండి 18 వ పంక్తిలో "క్షమించకండి" వరకు.

పేజీ 151 : 15 వ పంక్తిలో ప్రాసి: "తమరు మన్నిస్తే ..." నుండి 165 వ పేజీ 12 వ పంక్తిలో "ప్రాణంతీసేడితను" వరకు.

***

9

# 1

సమయం : మధ్యాహ్నం, సుమారు పన్నెండు గంటల సమయం.

స్థలం : ఊరికి చాలా అవతల, నల్లచెరువు అవతల స్థలం. చిట్టడవిలా ఉంటుంది.

ముగ్గురు యువకులు చల్లగా ఉన్నచోట కూర్చొని ఉంటారు. పక్కన ఒక తుపాకి ఉంటుంది. ముగ్గురూ కూడా కొంచెం అలసట పడినట్టుంటారు.

సుందరరావు : (సిగరెట్ కేసు విప్పి) ఇందరా, సత్యం.
సత్యం : ఏమిటి ? (అని ఏదో ఆలోచిస్తూ అన్నాడు)
సుందరరావు : సిగరెట్టు. ఏం ? కనిపించలేదా ? కళ్ళజోడు కావాలా?
సత్యం : నా కొద్దు.
మధుసూదనరావు : ఏ దొద్దు? సిగరెట్టా? కళ్ళజోడా?
సత్యం : గొప్ప విట్టు !
సుందరరావు : ఒద్దా సిగరెట్టు ?
సత్యం : కడుపులో ఏదైనా పడితేగాని పొగ భరించలేను. నా కిప్పుడొద్దు.
మధుసూదనరావు : వీడు పెద్ద సీరియస్ మనిషండీ సుందరంగారూ! సిగరెట్టొద్దనడానికి అంత సీరియస్‌నెస్ ఎందుకు చెప్పండి ? వీడు నవ్వినా సీరియస్‌గానే నవ్వుతాడు. మరింక లవ్ చేస్తే ఎంత సీరియస్‌గా జేస్తాడో చూడాలి.

సుందర : (ఈలోగా తనొక సిగరెట్ తీసుకొని మధుసూదనరావుకి ఒకటిస్తూ) కాల్చండి.

మధు : నే నెప్పుడో కాని కాల్చనండి. మనం తెల్లారు జామున అయిదింటికికదా బయల్దేరేం? ఇప్పుడెంతయిందండి?

సుందర : పన్నెండు దగ్గిర.

మధు : చూశారా! ఇప్పటికప్పుడే ఆరు కాల్చేశాను. (అంటూ సిగరెట్టు తీసుకున్నా డప్పుడేను) ఎన్నడూ లేదు.

సత్యం : ఆరవ్వేళ్ళయిందికద. మరొక షేడువ్.

మధు : కాల్చమంటావా?

సత్యం: సీరియస్‌గాను.

మధు : అయితే కాలుస్తాను. ]

(సుందరరావు, మధుసూదనరావు సిగరెట్లు అంటిస్తారు.)

సుందర: ఒరే సత్యం! కారెక్కడ పెట్టేవురా? చాలాదూరంఉందేవిఁటి?

సత్యం : లేదు.

సుందర : మరైతే వెళ్ళిన వాడింకా రాడేం? ఓసారి కేకెయ్!

మధు : నే పిలుస్తానుండండి, (అని) క్రిష్ణా! ఒరే క్రిష్ణా! (అంటూ గట్టిగా కేక వేస్తాడు)

కృష్ణారావు : (దూరంనుంచి) కమింగ్ !

సుందర : వేగిరం రమ్మనండి.

మధు : (గట్టిగా) త్వరగా రా!

కృష్ణా : (దూరంనుంచి) వస్తున్నా.

సుందర : ఒరే సత్యం! వీడు అక్కడే కొంత లాగించేడం లేదుకద?!

సత్యం : లాగించడు. నువ్వు తంతావని భయం ఉంది.

సుందర :తంతారంటే ఎవడికైనా భయం ఉంటుంది.

మధు : సుందరంగారూ! మీరు మిలిటరీలో ఉన్నారుకదా! మీకూ భయమే?

సత్యం : భయం అందరికీ ఉంటుంది. భయపడ్డా నిలబడ్డవాడే ధైర్యవంతుడు.

సుందర : ఆర్మీలో ఉంటే భయం పోతుంది.

సత్యం: నీ ఆర్మీ గొప్పలు నాదగ్గిర చెప్పకు.

మధు: నాకు ఆర్మీవాళ్లంటే చెడ్డ జెలసీస్మండీ! మీకు అంతరాత్మా గింతరాత్మా వీటి భయం ఏమీ ఉండదనుకుంటాను, ఏమండీ సుందరంగారూ?

సత్యం: చంపేవాడికి అంతరాత్మ ఎప్పుడూ అడ్డురాదు.

మధు: నేనేపని చేసినా అంతరాత్మని Consult చేసిగాని చెయ్యను.

సత్యం: వెధవా! నీకు అంతరాత్మంటూ లేదు. ఉన్నా దనుకోంటున్నా వంతే. ఉంటే మాలతిని పెళ్ళాడే ఉందువు.

సుందర: మాలతెవరు?

సత్యం: అదంతా వేరే కథలే.

మధు: ఏం లేదండీ సుందరంగారూ!

[ సుందర: అయామ్ సారీ! అడగల్లేండి.

మధు: వీడికి నేనంటే జెలసీఅండీ సుందరంగారూ! క్రిష్ణా, మీరూ అన్నాకూడా జెలసీలే వీడికి.

సత్యం: పోరా ఇడియట్!

మధు: కొడితే కొట్టు. తిడితే తిట్టు, ఆ మాటమాత్రం నిజం. నిజం చెప్పడానికి నేను భయపణ్ణు.

సత్యం: భయపడితే నువ్వు నిజం చెప్పనేలేవు.

సుందర: సత్యానికి నేనంటే ఎందుకండీ జెలసీ?

మధు: మీకు డబ్బుందనీ, మీరు గొప్పవాళ్లనీ — అందుకు.

సుందర: వాడికిమాత్రం డబ్బులేదూ? ఏమిరా లేదూ నీకుడబ్బు?

మధు: వాడికేమిటుంది? వాడి మేనమామకుంది. మేనల్లుడంటే ప్రొఫెసర్‌గారికి అభిమానంకాబట్టి ఇల్లిచ్చి, డబ్బిచ్చి, కావలిస్తే కారుకూడా ఇస్తున్నాడు.

సత్యం: ఒరే మధూ! నీమాటబట్టి ఏంతెలుస్తుందంటే నీకే నేనంటే జెలసీ! ఏమిరా సుందరం, అదే తెలుస్తోం దవునా?

సుందర: ఏమో నాకదేం తెలీదుగాని, ఒరే సత్యం, నీకుమాత్రం డబ్బున్న వాళ్లంటే ఇష్టంలేదురా. ఆమాట నిజం. నేనెన్నా ళ్లయిందిరా ఈ వూరొదిలేసి? ధర్డుఫారం పాసవగానే బెంగు

ఊరు పోయేను. అక్కణ్ణించి ఆర్మీకి పోయేను. ఇక్కడకి ఏడాది కోసారికదా ఒస్తున్నాను. నువ్వూ క్రిష్ణగాడు – మీ ఇద్దర్నీ తప్ప నాకీవూళ్ళో ఎవ్వరూ తెలీదు. ఎప్పుడొచ్చినా మీ ఇద్దర్నేకద కలుస్తున్నాను? మన ఫ్రెండు చెప్తే నాకు గుర్తొస్తోంది. నేనెప్పుడొచ్చినా నా ఎదుట నువ్వు డబ్బున్న వాళ్ళని దెప్పకుండా ఉండలేదురా.

సత్యం : నాకు డబ్బంటే ఇష్టంలేదు; కాని మనుషులంటే ఇష్టం లేక పోలేదు.

సుందర : అయిలే, మన కొత్త ఫ్రెండు చెప్పిన మాట నిజమే! సరే కాని, అయితే మీరంటే ఎందుకండీ మనవాడికి అంత ఈర్ష్య?

మధు : మాలతి నన్ను లవ్‌చేసిందని. అందుకూ!

సత్యం : నిన్ను చూస్తే నాకు ఈర్ష్యకాదురా వెధవా! అసహ్యం. ]

సుందర : ఓహో! మన ఫ్రెండు మధూగారు చిన్న రోమియో అన్నమాట. చెప్పేవుకావింతవరకూను. మైడియర్ సర్! అయితే మీ రివాళ దేవదాసు పాత్రకూడా వహించి తీరవలసిందే.

మధు : నేనేం తీసుకోనండీ. ప్లీజ్! నన్ను క్షమించండి.

సుందర : వీల్లేదు. మీ కివాళ ప్రారంభోత్సవం జరిపించు తీరుతాం. ఏమిరా సత్యం? జరిపించుదామా?

సత్యం : అభ్యంతరవేంటి బాబూ! (అని వెటకారంగా అంటాడు).

మధు : నా కొద్దండీ!

సుందర : సేవించి తీరాలి.

సత్యం : చచ్చినట్టు.

సుందర : మనవాడింకా రాడేం?

మధు : నే కేకేస్తా నుండండి.

సుందర : వేగిరం వెయ్యండి యుగంలా ఉంది క్షణం.

మధు : ఒరే క్రిష్ణా! (అని గట్టిగా పిలుస్తాడు).

కృష్ణారావు : (కొంత దగ్గర్నుంచి) ఒస్తున్నా!

మధు : (గట్టిగా) వేగిరం!

సుందర : జల్దీ!

కృష్ణారావు : కమింగ్ కమింగ్ (అంటాడు కొంత దగ్గర్నుంచి).
సుందర : రైటో! మరింక సర్దుక్కూర్చోండి.
మధు : నన్ను దయచేసి పార్టీలోంచి తప్పించేయండి సార్!
సుందర : మీ అర్జీ కొట్టిపారేసేం. తాగితీరవలసిందే. ఏరా సత్యం! అంతేనా ?
సత్యం : నువ్వలా అంటే వాడికి గొంతు ఎండిపోతుంది. ఆ వాటర్ బాటిల్లో కాస్త మంచినీళ్ళియ్యి.
మధు : ఆ వాటర్‌బాటిల్ చాలా బావుందండీ. అదికూడా మిలిటరీ సప్లయే కదండీ ?
సుందర : మిలిటరీ సప్లయే. మార్కుంటుంది చూడండి. కాని మీరు టాపిక్ మార్చాలని చూస్తున్నారు. మీ రెంత తప్పించుకుందామని ప్రయత్నించినా లాభంలేదు. తీర్థం తీసుకుతీరాలి.
సత్యం : అవును. తీసుకుతీరాలి. అందులోనూ అది లెఫ్టినెంట్ సుందరంగారి ఆర్డరు! పు ర పా ల క సంఘాధ్యక్షులు, పౌర మెంబరు సభ్యులు, అర్బన్ బ్యాంకు డైరెక్టర్లు, శ్రీ ఇలెక్ట్రికల్స్ సోల్ ప్రొప్రయిటర్లు అ యి న శ్రీశ్రీశ్రీ సార్వభౌమరావుగారి సుపుత్రులు లెఫ్టినెంట్ సుందరంగారి మాటకి ఎదురూ, తిరుగూ లేదు.
మధు : సార్వభౌమరావుగారి మాటెంతో ఈయన మాటా అంతేనంటావా ?
సత్యం : కాదామరి ?! వారు నిల్చోమంటే మనం నిల్చోవాలి, కూర్చోమంటే కూర్చోవాలి.
సుందర : సిగరెట్టు కాల్చమంటే కాల్చాలి. తాగమంటే తాగాలి.
మధు : (నవ్వుతూ) బ్రాతెల్ హావుసుకి వెళ్ళమంటే ?
సత్యం : వెళ్ళాలి. వారేం చెయ్యమంటే మనం అది చెయ్యాలి. వారు మనల్ని బతకమంటేనే మనం బతకాలి, చావమంటే చావాలి. జయ విజయీభవ దిగ్విజయీభవ! కరెక్టేనా ?
సుందర : ఏం ఎట్రా కరెక్టు ? వెధవా!
సత్యం : భవ భవ అన్నమాట.
సుందర : నన్నా అడుగుతావు ? నా కింగ్లీషే సరిగ్గా రాదు.

మధు : చూసేరా ? మిమ్మల్ని చూస్తే మనవాడ కెంత జెలసీవో !
సుందర : మిస్టర్ మధూ ! ఫర్ హెవెన్స్ సేక్ ! మీ జెలసీలన్నీ ఒక్క క్షణం అలా ఉంచండి. మన భారత వీరకుమారు డొస్తు న్నాడు. రారా క్రిష్ణా !
కృష్ణా : (ప్రవేశిస్తూ) సామాన్లు పట్టుకోండ్రా నాయన్లారా ! మొయ్య లేక చచ్చేను.
సుందర : ఆ రెండు సీసాలూ ముందు నా చేతికిలా ఇయ్యి. కార్కు విప్పగానే ప్రాణం లేచిరావాలి. (రెండు విస్కీ బాటిల్సూ తీసుకుంటాడు. తీసుకొని రుమాల్తో శుభ్రంగా తుడుస్తాడు.)
మధు : అమ్మో ! రెండు బాటిల్సే ?!
సుందర : ముందొకటి ఓపెన్ చేదాం.
కృష్ణ : ఈ సోడాలు అలా ఓ వార పెట్రా మధూ ! మొద్దూ !
సత్యం : ఆ తినుబడి పదార్థాలన్నీ ఇలా ఇక్కడకి రానీ.
కృష్ణ : మూటలన్నీ మీవైతే మరి నేనేమైనట్టు ?
సత్యం : గాడిదైనట్టు. తే ఇలా తే !
కృష్ణ : ఒరే, చంపేస్తారా సత్యం !
సత్యం : సత్యాన్ని చంపడం నీ తరంకాదు.
కృష్ణ : (సుందరం భుజంతట్టి, తినుబడి పదార్థాల బుట్ట పక్కనపెట్టు కొంటూ) మిలిటరీ మైటంతా నా సైడుంది. జాగ్రత్త !
సత్యం : ఆ బుట్ట అలా మధ్యనిపెట్టు (అని నలుగురి మధ్యా బుట్ట ఉంచేడు.)
[ కృష్ణ : ఒరే ! నన్ను గాడిదన్నావు, బుట్ట లాక్కున్నావు. ఇన్సల్టూ, ఇంజరీ రెండూనా ? నే నూరుకోను. నువ్వివాళ మసి, మరింక కానుకో ! (అని ఉత్తుత్తి కోపంలా అభినయిస్తాడు.)
సుందర : అరే క్రిష్ణా !
కృష్ణ : బీ హుజార్ !
సుందర : సత్యంగాడిది తప్పులేదురా !
కృష్ణ : సత్యం, గాడిదా ?

సుందర : (నవ్వి) కాదు, నువ్వు.
కృష్ణ : నువ్వానా ?
సుందర : ఛప్ !
కృష్ణ : నన్నిలా ఇన్‌సల్ట్ చెయ్యడం ?
సుందర : గాడిదలు మూటలు మోయును. నువ్వు మోసేవు, అంచేత నువ్వు గాడిదవి. వాణ్ణి మసిచేస్తానన్నావు. నన్ను చెయ్‌మరి.
కృష్ణ : నేను నిన్నేం అనను.
సుందర : ఎంచేత ?
సత్యం : ఎంచేతో చెప్పనా?
సుందర : చెప్పు.
సత్యం : గాడిద వెనకనాళ్ళనే తంతుంది. ముందున్నవాళ్ళ నేమీ చెయ్యదు.
కృష్ణ : ఒరే సత్యం! నీ తెలివితేట లమోఘం. కాని నా జెబ్బ చాలా బలం. అత్తెలుసుకో. ]
సుందర : అరే కృష్ణా! బ్రెడ్డూ వగైరా అన్నీ తియ్యి. పేపర్లలా పరువు. ఫిష్‌టిన్సేవీ ? 'ఓపెన్' చెయ్యి వేగిరం,
కృష్ణ : అక్కడే చేసేను. అంతా రెడీ! ఇవిగో టంబ్లర్స్. మరింక నీదే ఆలస్యం.
సుందర : సిగరెట్స్ఏవీ ?
కృష్ణ : అవీ తెచ్చేను.
సత్యం : ఒరే కారు మళ్ళీ లాక్ చేసేవా ?
కృష్ణ : చేసేన్రా బాబూ !
మధు : మేస్టరుగారూ ! సుందరంగారూ !
సుందర : అన్నీ అందరికీ సర్దుతున్నావురా కృష్ణా ?
కృష్ణ : కనులు పండువుగాను ! చూడు.
సుందర : శాబాష్ ! నమ్మిన బంటువిరా క్రిష్ణా !
కృష్ణ : జీ.
సుందర : అయితే మిస్టర్ మధూ ! మీరు సిద్ధంగా ఉండాలి.
మధు : క్షమించండి సార్ !

సుందర : క్షమించను.
మధు : నా కిష్టంలేదండీ.
సుందర : ఇష్టంలేకపోయినా సరే.
మధు : ఒద్దండీ! ఒద్దుసార్! నా కొద్దు.
కృష్ణ : రహస్యంగా రమ్మని పిల్చి, ఆగాగు మడికట్టుకున్నా నందిటు ఆఖరి కెవర్తోను. అలా ఉంది నీ వాటం! దీనికే జడిసిపోతే, ఒరేవెధవా, నువ్వింక జీవితపోరాటంలో ఎందుకుపనికొస్తావు?
సుందర : గోల్డెన్ వర్డ్స్!
సత్యం : క్రిష్ణగాడు పార్లమెంటులో ఉండాల్రా సుందరం. 'ప్రొహిబిషన్' ఘూణ్ణిమషాల్లో రద్దు.
కృష్ణ : థాంక్యూ రా సత్తిగా! మరింక కానీ రా మధూ!
మధు : నా కొద్దురా బాబూ! నువ్వితే నవ్వేవుకాని – నా అంతరాత్మ ఒప్పుకోదురా.
కృష్ణ : వెధవా నీ కంతరాత్మ అంటూ, ఉంటే, వేగిరం చంపే! నా కప్పచెప్తే ఘూణ్ణిమషాలపని. దాన్నలా వదిలేసి దార్లోకి దిగు.
మధు : దిగన్రా బాబూ!
కృష్ణ : వెధవా! జాన్సన్ ఏమిటున్నాడో మర్చిపోయేవురా? హీరో అవాలంటే బ్రాందీ తాగాలన్నాడా లేదా?
మధు : పోరా! నా కొద్దురా. నువ్వన్నీ ఇలాగే!
కృష్ణ : ఒరే చచ్చుపెద్దమ్మా! నీకు వీరుడివి కావాలని కోరికలేదా? వీరుడివి కావాలంటే విస్కీవే తాగాలి. దేవతలకు అమృతం, వీరులకు విస్కీ! ఏవింరా సుందరం? అవునా?
సుందర : కాదు మరి!
కృష్ణ : ఏం ఏం రా సత్తిగా? అవునా?
సత్యం : అవునంతేన్రా! యజ్ఞాలూ యాగాలూ పోయేయి. కత్తులూ కటార్లూ పోయేయి. సమ్మెలూ, సత్యాగ్రహాలూ పోయేయి. మనం మరింక వీరులం ధీరులం హీరోలం కావాలంటే మందు కొట్టి ముందింటికి వెళ్ళాలంతే!

సుందర: ఫుట్‌బాలూ, హాకీకూడా పోయియిరా, సత్యం! మర్చిపోయేవు.

కృష్ణ : నువ్వుండ్రా. నువ్వూ వాళ్ళేగేను! ఈ సత్తిగాడెప్పుడూ మూడ్ పాడుచేస్తాడు. అందుకే వీణ్ణిచూస్తే నా కసహ్యాం. మాధవి గురించీ, మాలతి గురించీ, మెర్లిన్ మన్రో గురించీ మాటాడుకొంటూ ఎంతో సంతోషంగా హాయిగా మనం ఉంటాం అనుకో. అప్పుడు ఏ టాపిక్ తెస్తాడో తెలుసా ?

సుందరం: ఏం తెస్తాడు ?

కృష్ణ : విశ్వమానవ కల్యాణం! సర్వమానవ సౌభ్రాతృత్వం!– ఆ టాపిక్ తెచ్చి మాట్లాడతాడు. మరింక చూసుకో మనకెలా ఉంటుందో.

సుందరం: సైబీరియా వెళ్ళినట్టుంటుంది!

కృష్ణ : అందుకే వీడి మాటలు వింటూంటే నాకు రిమ్మతెగులొస్తుంది. చేతలు చూస్తే బాబుది మళ్ళీ మన వైపే! అక్కడికైతే, వాడి ఉద్దేశం ఏమిటనుకున్నావూ ? వాడు తాగితే వాడు దేవదాసు; మనం తాగితే మనం మందుభాయీలం. నాచ్‌గర్ల్ దగ్గరకెళ్తే వాడు విప్రనారాయణుడు; మనం రామప్పంతులుగాళ్ళం. జూదానికి వాడు ధర్మరాజు; మనం శకుని మామలం. అది వాడభిప్రాయం. వాడిదంతా పెద్ద సుపీరియర్ ప్లేను. ఎంత సుపీరియర్ ప్లేన్ అయినా, చెడ్డ చెడ్డే! ఏంరా బ్రదర్, కాదంటావా ?

సత్యం: కంగ్రాచులేషన్స్‌రా. నన్ను బాగా స్టడీ చేసేవు. అవును, చెడ్డ చెడ్డే! చెడ్డతో రాజీకొచ్చేను. దెబ్బతింటాను. నాకు తెలును.

కృష్ణ : నిజం చెప్పేనా లేదా ?

మధు : చెడ్డని వీడు బాగా స్టడీ చెయ్యగలడండీ, సుందరంగారు.

సుందర : మిస్టర్ మధు! మీరు తీసుకుంటారా తీసుకోరా అమృతం ?

మధు : చెప్పేనుకదూ.

సుందర : అయితే మేమూ మానేస్తాం. మానేద్దాంరా.

కృష్ణ : మానేదాం.
సత్యం : ఒరే మధూ! ఒక్క గుక్కతాగు, కంపెనీకి. ఊఁ! కానియ్!
కృష్ణ : నలుగురితోపాటు నారాయణ.
సత్యం : నిన్నేం పెద్ద దుర్మార్గం చెయ్యమన్లేదు కదరా.
కృష్ణ : నిన్నేం పేకాటాడమన్నావాఁ?
సుందర : అబద్ధాలాడ మన్నావాఁ?
సత్యం : కొంపలు కూల్చమన్నావాఁ?
సుందర : కమాన్ మిస్టర్ మధూ! మరింక మీరు కాదనటానికి వీల్లేదు.
మధు : ఒద్దు సార్!
సుందర : ప్లీజ్ షటప్! చనువు తీసుకున్నానని మరోలా అనుకోకండి. మీరు మళ్ళీ కాదన్నారంటే మీకు బలవంతాన ఈ బుడ్డికి బుడ్డీ పట్టించేసి, మేం ముగ్గురం కార్లో వెళ్ళిపోతాం. కాసుకోండి.
మధు : అదికాదు సార్!
కృష్ణ : కానీరా మధూ! వాడికోపం వచ్చిందంటే వచ్చిందే. అన్నంత పనీ చేసేస్తాడు.
సత్యం : కొంచెం తీసుకోరా.
మధు : అయితే... అతి కొంచెం, నా కెక్కువొద్దు.
సత్యం : రైఠో!
సుందర : జయ్ కొట్రా క్రిష్ణా!
కృష్ణ : జయ్ శ్రీ మధూగారికీ...
సుందరం & సత్యం : జయ్!

(ఇప్పట్నుంచి సీసావిప్పడం, గ్లాసుల్లో పోసుకోవడం, సోడాలు కలపడం జరుగుతుంది.)

సుందర : (మధూని ఉద్దేశించి) మీలాటివాళ్ళని ఆర్మీకి తీసుకు పోవాలండీ.
కృష్ణ : అంతరాత్మ నాన్సెన్సంతా అక్కడ పిండిపారేస్తారు. తాగూ అంటే తాగు! చంపూ అంటే చంపు! అంతే! నోరెత్తడానికి వీల్లేదు.
సుందర : (విస్కీసీసా ఒకచేతిలో వుండగా, రెండోచేత్తో తుపాకి తీసి)

మందూ, మందుగుండూ రెండూ వుంటేనే కథ నడుస్తుంది. (తుపాకీ పక్కన పెట్టేస్తాడు).

సత్యం : మందుగుండు మీది, రక్తమాంసాలు మావి.

కృష్ణ : తీసెయ్రా వీడి థీరీ! ప్రపంచశాంతిమీద మన కింక ఓ గంట సేపు చింకిలెక్చరు! ఇస్తాడు. నాకు తెలుసు.

సుందర : సోడా సరిగా పాళంగా పణ్నీరా! మధూకిమాత్రం కొంచెం సోడా ఎక్కువ్వెయ్.

కృష్ణ : ఓ!

సుందర : అంతా రెడీ!

కృష్ణ : రెడీ! ఇంక కార్యక్రమం ప్రారంభిద్దాం!

సుందర : (గొంతుక సవరించుకొని) డియర్ ఫ్రెండ్స్, ఎన్డ్ ఫెలో బూజర్సు!

కృష్ణ : నా ప్రియమైన స్నేహితులారా, మందు మిత్రులారా!

సుందర : వుయ్ షెల్ నౌ స్టార్ట్ ఔట్ అన్ దిస్ ఆల్కహాలిక్ అడ్వెన్చర్!

కృష్ణ : మనం ఇప్పుడు మందుకొట్టడానికి ముందడుగు వేస్తున్నాం. కదనరంగంలో కురుకుతున్నాం.

సుందర : బిఫోర్ వుయ్ బిగిన్ ది అడ్వాన్స్, ఐ యామ్ హాపీ టు టేక్ ఇన్ టు అవర్ ఫోల్డ్ దిస్ అవర్ న్యూ ఫ్రెండ్ మిస్టర్ మధు.

కృష్ణ : మనం కొద్ది క్షణాల్లో అటాక్ ప్రారంభిస్తాం. ఈ శుభ సమయంలో కొత్తమిత్రుడు మధూగాడికి మన 'వెల్కమ్'! వారు–అంటే మన మధూగాడు–మందు 'గాంగ్'లో చేరడం మా అందరికీ ఆనంద దాయకంగా ఉంది. ఒక్కసారి అందరూ చప్పట్లు కొట్టండి.

అందరూ : (చప్పట్లు కొడతారు)

సుందర : ఇవాళ ఎన్నోతారీకు ?

సత్యం : మే నెల ఇరవైమూడో తారీకు.

సుందర : అన్ దిస్ ట్వెంటిథర్డు డే ఆఫ్ ది మన్త్ ఆఫ్ మే ...

కృష్ణ : ఈ మే నెల ఇరవైమూడో తారీకున

సుందర : అవర్ గుడ్ ఫ్రెండ్
కృష్ణ : మన సుమిత్రుడు
సుందర : మిస్టర్ మధు
కృష్ణ : మన మధూగాడు
సుందర : షెల్ నో ఆల్ అబౌట్ ఆల్ ది బాటిల్డ్ మిస్టరీస్.
కృష్ణ : సీసా రహస్యాలన్నీ తేటతెల్లముగా తెలుసుకొనును.
అందరూ : (చప్పట్లు కొడతారు)
మధు : నాకేమిటో భయం వేస్తోందండి.
కృష్ణ : అపశకునం పలక్కురా బాబూ!
మధు : భయంగా ఉందిరా.
కృష్ణ : అందుకే కొత్రా విస్కీ. కొడ్తే భీరులు ధీరులవుతారు.
సుందర : మనుషులు పెద్ద మనుషులవుతారు.
సత్యం : ఎలకలు పందికొక్కులవుతాయి. మరేం భయపడకు.
సుందర : (గ్లాసు చేత్తో ఎత్తుతాడు. అందరూ ఎత్తుతారు.) టు ది హెల్త్ ఆఫ్ మిస్టర్ మధు (అందరూ గ్లాసులు క్లిక్ చేస్తారు. తాగుతారు.)
కృష్ణ : ఆహా ఏమి వాసన్రా! గుమ్‌గుమ్.
సత్యం : ఏఁవిఁరా మధూ, ఎలా వుంది ?
మధు : అదోలా వాసనేస్తోందిరా.
కృష్ణ : వెల్లుల్లి వాసనా ?
మధు : అటువంటిదే.
కృష్ణ : ఉల్లిచేసిన మేలు తల్లి చేయదు. మరేం ఫరవాలేదు. అలా నెమ్మదిగా చప్పరించు. 'ఇంజ' నదే హీటెక్కుతుంది.
సుందర : కిక్కు 'స్లో'గా ఎక్కనీయండి.
సత్యం : చలికాలంలో కుంపటిముందు కూర్చున్నట్టు లేదురా ?
కృష్ణ : ఇంకొంచెంసేపొపోతే, రగ్గేసుకు మాలత్తో మాట్లాడినట్టుంటుంది.
సుందర : మాలతి గురించి ఇప్పుడు చెప్పండి మిస్టర్ మధూ!
[ మధు: ఏంలేదండీ. వీళ్ళేవో నన్నొట్టినే ఏదో అంటారు. నేను మాలతి నేం చెయ్యలేదు.

సత్యం : పిచ్చాసుపత్రికి పంపించే వంతే! వెధవా, నోర్ముయ్!

కృష్ణ : అమ్మో! ఈ మధూగాడిలా మెత్తమెత్తగా ఉన్నాడనా? వీడితో గొప్ప డేంజరు. ఒరే సత్తిగా, వీడు మొన్న ఏంచేసేడో తెలుసా?

మధు : నే నేమిటి చేసేను? ఏం చెయ్యలేదు.

కృష్ణ : వీడు కొంపత్తీసే కొరివేకాదు; తైరుమాస్టర్ జనరల్ కూడాను. మొన్న మా ఇకనామిక్స్ లెక్చరరింటికి ఏం మోసుకెళ్ళేడో తెలుసా?

సత్యం : ఏవిట్రా మోసుకువెళ్ళేవు?

మధు : చీపుళ్ళు!

సత్యం : హోరి వెధవా!

మధు : కొండ చీపుళ్ళు దొరకలేదంటే తెప్పించి ఇచ్చేను. మరైతే క్రిష్ణగాడు ఏం మోసుకువెళ్ళేడో అడగరేం?

సుందర : నువ్వేం మోసుకెళ్ళేవురా?

కృష్ణ : (దుఃఖం నటిస్తూ) చెప్పలేన్రా బాబూ!

సత్యం :
సుందర : } చెప్పా.

కృష్ణ : చెప్పజాలను.

మధు : చేసిన పాపం చెప్తే పోతుంది. చెప్పి వెధవా?

కృష్ణ : అయితే చెప్పేసుంటూరా?

సుందర : చెప్పు. ఏం మోసుకెళ్ళేవు?

కృష్ణ : పిడకల్రా నాయన్లారా పిడకలు!

సుందర :
సత్యం : } (నవ్వుతారు)
మధు :

కృష్ణ : ఏం చెయ్యడంరా బాబూ! ఇంత మహాపట్నం ఉందికాని వెధవది ఈ పాటి పేడా దొరకదు, అపాటి పిడకలూ దొరకవంటూ వాడిపెళ్ళాం వాటికోసం వేటాడి వేటాడి విసిగిపోయింది అలిసిపోయింది.

మధు : అలిసిపోతే మనవాడు వెళ్ళి బండెడు పిడికల్లో సేద తీర్చేడు.
కృష్ణ : ఏంచేస్తాం ? నుదుట రాసిపెట్టేడు బ్రహ్మదేవుడు.
సుందర : ఏమని ?
సత్యం : పిడకలు మొయ్యమని.
సుందర : అయితే, ఇకనామిక్సంటే పిడకలూ, చీపుళ్ళూ అన్నమాట.
మధు : మామూలు చీపుళ్ళు కావు. కొండచీపుళ్లు. వాటికోసం వెతక లేక చచ్చేను.
సుందర : మరైతే పాలిటిక్సంటే ఏమిటి ?
మధు : ఇచ్చకాలూ, పోటీలూను.
కృష్ణ : చెవి కొరికేస్తేకాని వాడికి తనివితీరదు.
మధు : మనం వాడి చెవులు కొరికేస్తే, వాడు తిన్నగావెళ్ళి అవతల వాళ్ళ పీకలు తీసేస్తాడు—అంటే—మార్కులు కోసేస్తాడు.
కృష్ణ : అలాగే హిస్టరీ అంటే ఏమిట్రా మధూ ? కొంచెం చెప్పుము.
మధు : హిస్టరీ అంటే మందులు.
కృష్ణ : వాడికి పెళ్లామనే మహావృక్షం వుంది. చూడ్డానికి ఆడభీము డంటే ఆడభీముడు. ఆ మహావృక్షాన్ని వాడు మందులు పోసి పెంచుతున్నాడు.
మధు : మందులు మనం కొనాలి.
కృష్ణ : పెళ్ళాన్ని వాడు పెంచాలి.
సత్యం : మరింక మా 'లా' వాడున్నాడు !
సుందర : 'లా' అంటే ఏమిటి ?
సత్యం : డబ్బు ! వాడికి మరేం అక్కర్లేదు. డబ్బిస్తే, మందులూ, పిడకలూ, చీపుళ్ళూ, చీరలూ అన్నీ వాడే కొనుక్కుంటాడు.
సుందర : వాడికి చీరలెందుకూ ?!
సత్యం : వాడికి పిడకలు మాత్రం ఎందుకూ ! పొయ్యికి పిడకలూ, పెళ్ళానికి చీరలూను.
మధు : చీపుళ్ళెవరికి ?
కృష్ణ : నీకు ! వీపుమీదికి.

సుందర: మిష్టర్ మధూని ఏం అనకంట్రా. మిష్టర్ మధూ! మీ మాలతిగురించి చెప్పేరు కారు. ]

కృష్ణ: మాలతిగురించి నన్నడుగు. టూకీగా టకటకా చెప్తాను.

సత్యం: మరేంలేదు. భగ్నప్రేమ. పగిలిన గుండె. చెదిరిన మనసు. అదీ ఆమె వృత్తాంతం.

కృష్ణ: మరింక మధూగాడి సంగతి చెప్పాలంటే!

మధు: నీ సంగతి నిజంగా చెప్పాలంటే నువ్వు కొంప తీసే కొరివ్వి.

కృష్ణ: మధూగాడు చాపకింద నీరు.

మధు: క్రిష్ణగాడు జేబులోని తేలు.

సుందర: (చప్పట్లుకొట్టి) బ్రిలియంట్! బ్రిలియంట్!

సత్యం: ఒరే రాస్కెల్స్! మీ ఇద్దరికీ ఆలయాలు కట్టించాల్రా!

సుందర: ఆలయాలెందుకూ?

సత్యం: నిజం చెప్పినవాడు భగవంతుడితో సమానం. వెధవలిద్దరూ ఎంత నిర్భయంగా నిజం పలికేస్తున్నారో చూడు.

సుందర: అదా అన్నావు?! బ్రిలియంట్! బ్రిలియంట్!

కృష్ణ: ఓహోహో! అక్కడికీ సత్తిగాడు పెద్ద మహాత్మా గాంధీ గారైపోయినట్టు! ఒరే సుందరం! వీణ్ని నమ్మకురా. వీడికి నువ్వంటే ఇష్టంలేదు. నన్నడుగు నే చెప్తాను.

సుందర: పర్మిషన్ ఇచ్చేను. ఏం చెప్తావో చెప్పు.

మధు: వీడేం చెప్తాడు? అబద్దాలప్ప! సుందరంగారూ, మీరు వెళ్ళి ఒక్కసారి చూడండి. మా పొలిటిక్స్ లెక్చరర్‌కి చెవులుండవు. వీడే కొరికేసేడు. వీడి చాడీలు విని వాడు రోజుకొకడి పీక కత్తిరిం చేస్తున్నాడు. వీడు జేబులోని తేలు.

కృష్ణ: చాపకింద నీరు వెధవా నోర్ముయ్! నీ కూడా సత్తిగాళ్లాగే చెప్పలేనంత జెలసీ.

సత్యం: ఒరే కరటక దమనకులూ ఊరుకోండి.

కృష్ణ: చెప్పేది చెప్పనివ్వడురా సుందరం, ఈ మధూగాడు! నే చెప్పేదేమిటంటే ఈ సత్తిగాడికి నువ్వంటే జెలసీ.

[ మధు: అదే నే నంటున్నదీను.

సత్యం: పిల్లికి ఎలక సాక్ష్యం. ]
సుందర: [ మిస్టర్ మధూ, నేనంటే సత్యంగాడికి ఇష్టంలేదనిశంటాట్లా అన్నావు. ] ఎందుచేత [ ఇష్టంలేదన్నావ్ ] ?
కృష్ణ: నువ్వు సార్వభౌమరావు గారి కొడుకువి. ఒక్కడే కొడుకువి. నీకు తల్లిలేదు, అన్నదమ్ములేరు. అప్పచెల్లెళ్ళులేరు. మరింక మీ బాబు ఆస్తంతా నీకే వస్తుందిగద!
సుందర: అది నా అదృష్టం.
సత్యం: ఒరే సుందరం! చెప్తున్నా విను. నాకు మనుషులంటే ఇష్టం. డబ్బంటే ఇష్టంలేదు. నిన్ను నాచు చుట్టేసినట్టు చుట్టేసింది డబ్బు. వీళ్ళకి నాచుకావాలి. నాకు మనిషి కావాలి. క్రిష్ణ గాడి కైతే, నాచుతప్ప మరో టక్కర్నే లేదు.
మధు: నాకు రెండూ కావాలి.
క్రిష్ణ: అవున్రా సత్తిగా, సుందరంగాడు గొప్పవాడు కాబట్టి వాడి వెనకాతల తిరుగుతున్నాను. అంతేనా నీ అభిప్రాయం?
సత్యం: ముమ్మాటికీ అంతే.
మధు: బాగా ఇచ్చేవురా, సత్యం క్రిష్ణగాడికి డోసు!
కృష్ణ: షటప్ రా మధూ! షటప్ అంటే షటప్! ఎవడు తంతానంటే వాడి సైడుండే వెధవ్వి నువ్వా మాట్లాడ్డమే?!
సుందర: చాలించండి. మరింక ఈ టాపిక్ ఎవరూ తేవద్దు. మిస్టర్ మధూ! గ్లాసు పట్టుండి.
మధు: మళ్ళానా?
సుందర: లాగించండి.
సత్యం: వాణ్ణి అడక్కండి. గ్లాసు నింపేడమే నీ పని. తాగరా మధూ.
మధు: మీ ఇష్టం. అయితే! నా తప్పేంలేదు. ఏం జరిగినా మీదే తప్పు.
క్రిష్ణ: అవతలవాడిమీద తప్పు తోసేడానికి వీడు గురువు. మాలతి కొశ్చన్లో ఏం చేసేడు? నాది కాదు మా అమ్మది తప్పంతా అన్నాడు.

సుందర : మాటి మాటికీ ఈ మాలతి మాట తెస్తున్నారు. ఎవరు ఏమిటి సంగతి?

కృష్ణ : ఎవరా మాలతి? ఏమా కథ? అంతేనా నువ్వడిగేది.

సత్యం : (కృష్ణని ఉద్దేశించి) క్రూడ్ ఫెలో!

కృష్ణ : చాలించండి చాలించండి, "సత్యమేవ జయతేగారూ!" మీ పాటి కల్చరు మాకు లేకపోలేదు.

సుందర : [ ఇంతకీ మాలతెవరు? ] నాకు చెప్పేరుకారు. చెప్పిలేరా లిప్పుడు.

మధు : మాలతి నన్ను లవ్ చేసిందండీ.

సత్యం : సిగ్గులేదూ, వెధవా, చెప్పకుండికి?

మధు : సిగ్గెందుకూ? నాదేం తప్పులేదు.

కృష్ణ : మాలతి మా జూనియరు. అసలే వెర్రిది.

మధు : వెర్రిదా?!!

కృష్ణ : ఎంత వెర్రిది కాకపోతే నిన్ను లవ్ చేస్తుంది? ఒరే, సుంకర్ ఆ వెర్రిది వీణ్ని లవ్ చేసింది. వీడికోసం మొదట బీచికొచ్చిందీ, తరువాత వీడితో సినిమాకొచ్చింది. ఆఖరికి ఇంటికొచ్చి పెళ్లాడమని కూర్చుంది. దాన్తో ఈ వెధవ తారెత్తిపోయేడు. తారెత్తిపోయి కిస్తా ఇచ్చేసేడు.

సుందర : ఆఖరికి 'కిస్తా' ఇచ్చేసేడన్నమాట! శభాష్ మిస్టర్ మధూ!

మధు : వీడి సలహాకూడా నేను పాటించానో లేదో అడగండి. అలా చెయ్యాలీ అని వీడే అంతా చెప్పేడు.

కృష్ణ : వెధవా! నువ్వడిగితే చెప్పేనా? అడక్కుండా చెప్పేనా?

సత్యం : ఒకణ్ని మించిన రాస్కెల్ మరొకడు.

కృష్ణ : ఆఖరి కేంచేసేడో తెలుసా?

సుందర : ఎలా ఒదుల్చుకున్నాడు?

కృష్ణ : "మా అమ్మ ఒద్దంది, నన్నేం చేయమంటావ"న్నాడు. ఆ పిల్ల ఇంటికొస్తే చాలు, ఇంట్లోంచి పీనుగు పోయినట్టు ఏడుస్తూ కూర్చునేది వీళ్ళమ్మ. దాన్తో పిల్ల బాజోట్! తిన్నగా వెళ్లిపోయింది అదే వెళ్లిపోడం...

సత్యం : ఎక్కడకని అడగండి.

సుందర : ఎక్కడికి ?

సత్యం : పిచ్చాస్పత్రికి. అంత రాస్కెల్ వీడు! వీడికి (కృష్ణని చూపించి) ఆ రాస్కెల్ సలహా! చాపకింద నీరొౕకడు, జేబులోని తేలొౕకడు. బాగా పెట్టుకున్నారు, వెధవల్లారా, పేర్లు! మాలతంటే వీడికి ఇష్టమేనట! కాని అమ్మంటే ఎంతో భక్తిట. మాలతిని చేసుకుంటే, అమ్మ నూతిలో పడిపోతాన్రా నాయనా, అందిట. అలా అని చెప్పి వాళ్ళమ్మ నూతిలో పడిపోయినట్టు, కాటికావిణ్ని మోసుకుపోయినట్టూ, అక్కడావిడ కాలి బూడిదై పోయినట్టూ వలవల ఏడ్చేసేడు, వెధవ! ఇలాటి వెధవల్ని షూట్ చెయ్యాలా ఒద్దా ?

సుందర : నువ్వు 'సిల్లీఫెలో' విరా సత్యం! మధ్యని నీ కెందుకంత కోపం ?

కృష్ణ : హియర్ హియర్!

మధు : ఈ వెధవకి నే నంటే జెలసీ!

సత్యం : ఈసారి 'జెలసీ' అన్న మాటన్నావంటే తంతాను. మాలతి అక్కడ పిచ్చాస్పత్రిలో రోజూ ఏం చేస్తూందో తెలుసా? ఇవిగో మధూగాడి గుడ్లు! పీకేస్తాన్ పీకేస్తాన్ అంటూ గోడలు బక్కి రేస్తోందిట.

కృష్ణ : ఓర్ నాయనో! నువ్వక్కడి కెళ్ళకురా మధూ!

మధు : నాన్సెన్స్! లవ్ చెయ్యమని దాన్ని నేనేం అడగలేదు. అదే నన్నిలా తినేసింది.

సుందర : ఒరే సత్యం! నీ గ్లాసు అలానే ఉండిపోయింది.

సత్యం : సారీ బ్రదర్ సారీ! (అంటూ తాగి) ఔను హాలులో పెద్దలు కొందరు ...

కృష్ణ : రౌను టేబిలూ చుట్టూ చేరి...

మధు : ఔన్సు గ్లాసుతో ఔనౌ నంటూ ...

సత్యం : సీదా ఖాళీ చేసేరయ్యా!... ఏమిటీ ??

సుందర : రమ్మూ! జిన్నూ! బ్రాందీ! విస్కీ!

అందరూ : విస్కీ !!

సుందర : మిస్టర్ మధూ! మరికొంచెం లాగించు గురూ!

మధు : వేయించండి. కొంచెం! చాలు! మరికొంచెం అంటారా? వేయించండయితే. ఊఁ ఊఁ! చాలు! బస్! కాని చూడండి సుందరంగారూ! మాలతి, మాలతుందే, మాలతి విషయంలో నాదేం తప్పు లేదు. నా అంతరాత్మ నడిగేను.

కృష్ణ : అడిగితే ఏమిటుంది?

మధు : 'నీదేం తప్పులేదు మధూ' అంది నా అంతరాత్మ. ఏదేమైనా నాకేం ఫరవాలేదు. నా అంతరాత్మ నన్ను తిట్టిందంటే మాత్రం మరింక నేను నేను నేను... ఏం చెప్తున్నానూ?

కృష్ణ : అంతరాత్మ తిడితే ఏమవుతుంది?

మధు : తిడితే మరింక నేను బతకలేను.

సత్యం : ఈపాటికి చచ్చిపోవలసిందయితే నువ్వు.

మధు : ఈ వెధవ సత్తిగాడి మాటలెవరూ నమ్మకండి. మాలతి పెళ్ళి చేసుకోమంది. 'కోను పొమ్మన్నాను. అలా అనడం తప్పా? ఈ సత్తిగాణ్ణి చేసుకోమంటే, కుంటాడా? మిమ్మల్ని కుంటా మంటే కుంటారా?

కృష్ణ : ఏఁ విట్రా కుంటుడం రాస్కెల్!

మధు : చేసుకో వొద్దు వొద్దంది నా అంతరాత్మ; నాదెంత మాత్రం తప్పులేదు. కావలిస్తే చూసుకోండి! నా అంతరాత్మ, క్లీన్, ఎంత క్లీన్‌గా ఉందో చూసుకోండి. మరకలేమైనా ఉన్నాయేమో భూతద్దం రప్పించి వేసి చూసుకోండి! ఈ సత్తిగాడి మాటలు నమ్మకండి.

సుందర : మిష్టర్ మధూకి అందుకుందిరా...

సత్యం : ఏమిటి?

కృష్ణ : తారా, జువ్వ !!

మధు : మీరాగండంతా! మిష్టర్ సుందర్! ఈ సత్తిగాడి మాటలు ప్లీజ్ డోన్ట్ బిలీవ్! నమ్మకండి. వీడో రాస్కెల్. వీడిబాబు చస్తే వీడి మావఁ వీణ్ణి పెంచి పోష్ పోషించేడా లేదా?

సత్యం : అయితే ?

మధు : అలా ఆగు !

కృష్ణ : ఆగివిను !

మధు : పోష్ పోషించేడు. చదువు చెప్పించేడు. కారు, కారడిగినా ఇస్తున్నాడు. కారడిగితే ఎవరు యిస్తారు చెప్పండి. మీరిస్తారా ? అరే కిసన్‌కా భయ్యా, నువ్విస్తావా ?

కృష్ణ : కారూ, పెళ్లాం – ఈ రెండున్నూ అరువు ఇవ్వబడవు. టర్మ్స్ కాష్ ! నగదు బేరం తప్ప మరో బేరం లేదు.

సుందర : అరే బాప్డర్ ! షటప్ :

కృష్ణ : మాఫ్ కీ జియె సర్‌కార్ ! కారుకాని కారు సర్‌కారు ! గొప్ప జోకు జోకేను. బ్యూటీ.

సుందర : నోరు మూస్తావా ? తన్నమన్నావా ?

కృష్ణ : శరణు శరణు.

మధు : మిలిటరీ తిరగబడితే నీకు శరణెక్కడ ?

కృష్ణ : అప్పుడు సత్యంగాడి శరణుంటుంది ? ఏంరా సత్తె ?

సుందర : వాడికే దిక్కు లేకపోతే నీకెక్కడ ?

సత్యం : ఆ వెధవ నీ కాళ్ళు పట్టుకు పిసకరిస్తాడు కాని నన్ను శరణడగడు.

మధు : వీడు – ఈ సత్యంగాడు – వీడన్నీ ఇలాటి వెధవ మాటలే ! అంటే నేనూ క్రిష్ణగాడూ నీ పైసా నీ సీసా నీ వేషం చూసి నీకు దాసులం అని వాడభిప్రాయం. వీడు రోగ్ !

సత్యం : నోరుముయ్యండి వెధవల్లారా ?

మధు : మావం మీద బతికేస్తున్నాడు కాని మావం కూతుర్ని మాత్రం పెళ్ళాడట్ట.

సుందర : వీడి మావం కూతురంటే, ఆ జాంబవతీ కన్యేనా ?

సత్యం : షటప్ !

మధు : బాగా చెప్పేరు. ఏదీ చిన్న 'షేకు !' (అని సుందరరావుతో చేతులొకసారి కలిపేడు) ఆ అమ్మాయే !

కృష్ణ : చీకటిలోనే చూడవలెను.

మధు : ముసుగువేసి చూపించవలెను.
కృష్ణ : గొరిల్లా ఆర్మీకి పంపించవలెను.
సుందర : గొరిల్లా కాదురా రాస్కెల్, గెరిల్లా గెరిల్లా!
సత్యం : మీరా పిల్లసంగతి ఎత్తేరంటే తంతాను.
మధు : మావం డబ్బుకావాలి కాని కూతురక్కర్లేదట.
కృష్ణ : దేశ్ దేశసేవ చేస్తాట్ట. అందుకోసం ఇప్పుడప్పుడే పెళ్ళి చేసుకోట్ట.
మధు : ఇలాటి కిటుకులు మనకి తెలేవుట్రా కిష్టా! ఈ సత్యంగాడి సంగతి నన్నడుగు. నే చెప్తాను. వీడు...
కృష్ణ : దుర్మార్గపు వెధవ.
మధు : కాదు. ఓర్వలేని వెధవ.
సత్యం : ఒప్పేసుకున్నాను. చాపకింద నీరుగాళ్ళనీ, జేబులో తేలుగాళ్ళనీ చూసి నేను ఓర్వలేను
మధు : ఒప్పుకోక ఏంచేస్తావు?
కృష్ణ : ఒరే సుందర్! నేనోటి చెప్తాను విను. నువ్వూ నేనూ సత్తిగాడూ ఎప్పటి స్నేహితులం? అయిదో క్లాసులో,– ఆ తరవాత నువ్వు బెంగుళూరు వెళ్ళనే వెళ్ళిపోయేవు– అయిదో క్లాసులో నిన్నోసారి వాడు తన్నేడు. జ్ఞాపకం ఉందా?
సుందర : నేనుకూడా వాణ్ని తన్నేను.
సత్యం : ఉడుక్కుని రాయివిసిరి కొట్టేవు వెధవా!
సుందర : షటప్.
కృష్ణ : అయినా వీణ్ణి క్షమించి తరవాత మనతో స్నేహం చెయ్యనిచ్చేం. అవునా?
సుందర : అవును.
కృష్ణ : మనం ఫ్రెండ్స్‌వేనా?
సత్యం : కాదని ఎవడన్నాడు? మళ్ళీ మిమ్మల్ని ఎప్పుడైనా తన్నేనా?
కృష్ణ : నువ్వలా ఉండరా!
మధు : కిషన్ భయాంని మాటాణ్నీరా సత్తిగా!
కృష్ణ : ఫ్రెండ్స్‌లో మనకీ మనకీ జెలసీ ఉండొచ్చురా! నీ పొదరు

పార్లమెంటు మెంబరయేడు, లక్షాధికారయేడు. నువ్వు ఆర్మీ ఆఫీసరయేవు. కావలిస్తే రిజైనిచ్చేసి కాలుమీద కాలువేసి కూర్చోగలవు. అది నీ అదృష్టం.

మధు: కరెక్ట్!

కృష్ణ: వాడి బాబు వాడి చిన్నప్పుడే కునికేసేడు. అప్పుడు వీడు మావఁ పంచని చేరేడు. అది వాడి దురదృష్టం.

మధు: కరెక్ట్! అయినప్పుడు వాడికెందుకా జెలసీ?

కృష్ణ: ఇప్పుడు నే నున్నాను.

సత్యం: ఎందుకూ ఉండడం?

మధు: నువ్వుండ్రా సత్తిగా! చెప్పరా కిషన్! ఏమండి మిస్టర్ సుందర్!

కృష్ణ: ఇప్పుడు నే నున్నాను. నేను పాపరు వెధవని, కుచేలుడి కొడుకుని. నువ్వు రారాజు కొడుకువి, రాక్‌ఫెల్లర్ తమ్ముడివి. అయితే, నువ్వంటే నాకు జెలసీ ఉందా?

సుందర: లేదు లేదు. నువ్వు నాకు డియరెస్ట్ ఫ్రెండువి.

సత్యం: వీడు నీకు తైరుపోస్తాడు. వీడి బాబు నీ బాబుకి తైరుపోస్తాడు. తైరు అనగా మస్కా, మస్కా అనగా కాకా, కాకా అనగా క్రో కాచింగ్! అదీ సంగతి.

కృష్ణ: బాబుల సంగతి తే కొరే!

సత్యం: తెస్తాను. ఏం చేస్తావు? నీ ఫాదరు ఈ సుందరంగాడి ఫాదర్ శ్రీశ్రీశ్రీ సార్వభౌమరావుగారికి రోజూ రెండుశేర్లు చిక్కటి తంజావూరు తైరు పోస్తాడు. గోదావరి జిల్లా అసలు మస్కా రాస్తాడు. పొద్దున్నా, సాయంకాలవూఁను, రెండు పూట్లాను.

కృష్ణ: షటప్! నీ సంగతి నేను చెప్పలేనా?

సుందర: వాడి ఫాదర్ సంగతి ఎత్తకురా సత్యం!

సత్యం: ఎత్తుతాను. ఏం చేస్తాడు వాడు?

మధు: ఏం చెయ్యలేడుకాబట్టి వాడిమీద డాబు చెయ్యగలవు. అంతేనా?

కృష్ణ : నేను తల్చుకుంటే, వీడు అరనిమిషంలో మసి! అరనిమిషం పట్టదు. ఇరవైమూడుంపావు సెకండ్లలో మసి.

సత్యం : పోరా పోరా, జేబులో తేలూ! 'జేబులో తేలు' గొప్పపేరు! బాగా పెట్టుకున్నావురా!

కృష్ణ : చూడ్రా నువు మసికాకపోతేను. స్పేర్ చేసినకొద్దీ మామీద 'రైడ'యి పోతున్నావు. అరే సుదరర్! నువ్వు వాడికి ఫ్రెండు వేనా? వాడికి చనువిచ్చి నెత్తి కెక్కించుకున్నావా? అయితే, వీడికి నువ్వంటే పీకల్దాదాకా ఉంది కుళ్ళు. మీ ఫాదరు ఫార్లమెంటు మెంబరైతే వీడి ఏడుపు ఏం చెప్పను?

సత్యం : సుందరం అంటే నా క్కోపంలేదు.

కృష్ణ : కాని, వాడి నాయన్నిచూస్తే మాత్రం అక్కసు. అంతేనా?

సత్యం : అది పరమసత్యం. ఈ ఒక్కసారికి నిజం పలికేవు.

కృష్ణ : చూసేవా? మీ ఫాదరు ఓట్లు కొనుక్కున్నాట్ట. దొంగ వోట్లు వేయించుకున్నాట్ట. పేటలు పేటలుకి పీపాల్తో సారా పట్టించేసి, జయ్ కొట్టడంమాత్రం గాంధీ మహాత్మాకి జయ్ కొట్టేట్ట. శ్రీరామచంద్రుళ్లా కబుర్లు చెప్తాడు. కాని, రావణాసురుళ్లా మీ సుశీలని ...

సుందర : మా ... మా ... మా సుశీల పిన్నా?

కృష్ణ : ఆఁ, మీ సుశీల పిన్నే! ఆవిణ్ని పెంచిన వీలు చూసుకొని చిన్న పిల్లప్పుడే పాడుచేసి దగ్గిర ఉంచుకున్నాట్ట!

సత్యం : మరొక డా వయసులో ఉన్న పిల్లని పాడుచేస్తే దాన్నే— 'రేప్' – రేప్ అంటారు. పదేళ్ళు జెయిలుంది, ఆ పనికి.

సుందర : (గ్లాసు ఎత్తిపెట్టి ఒక్కసారి తాగి) నువ్వివాళ మసిరా రాస్కెల్! (అన్నాడు సత్యాన్ని ఉద్దేశించి)

కృష్ణ : మిమ్మల్ని ఎన్ని మాట లన్నాడో చూసేవా?

సుందర : నా సుశీల పిన్నిని ... మా సుశీల పిన్నిని ...

సత్యం : నీ కావిడ ఎటువంటి పిన్నిరా ఫూల్! నీ ఫాద రావిణ్ణి, గతిలేని మనిషిని చేరవేసి, పాడుచేసి సాకుతున్నాడు. నీ వయసు దావిడ.

సుందర : షటప్! నా కంటే రెండేళ్ళు పెద్ద. మా ఫాదరు ఆవిణ్ని పెళ్లాడితే ఆడతాడు. లేకపోతే లేదు. ఊళ్లో ముష్ ముష్ ముష్టివెధవలు. మా గురించి మాట్లాడ్డానికి వీల్లేదు, వీల్లేదంతే.

సత్యం : ఆడవాళ్ళని పాడుచెయ్యడం పెద్దమనుషుల లక్షణంకాదు. కావలిస్తే పెళ్ళాడమను!

కృష్ణ : ఆయన ఇష్టంవచ్చినట్లు ఆయన చేస్తారు. నువ్వెవడివి చెప్పడానికి, మధ్యని?

సత్యం : నేను సత్యాన్ని.

సుందర : నోర్ముయ్!

సత్యం : నేను నిజం చెప్తాను.

మధు : ఒహెూ! ఒహెూ!

కృష్ణ : గాంధీగారు ఆకాశంలోంచి దిగేరు!

మధు : మహాత్ములు మట్టిలోంచి పుట్టుకొచ్చేరు!

సుందర : మహాత్మా గిహాత్మా జాన్తానై! నన్ను, మా ఫాదర్ని, మా కుటుంబాన్ని, మా బంధువుల్ని, స్నేహితుల్ని, ఆశ్రితుల్ని మాలో ఎవర్నయినా సరే, ఎత్తిపెట్టి ఎదిర్చిన వాడల్లా సఫా!

సత్యం : నన్నాపడానికి నీలాటివాళ్ళు పనికిరార్రా బ్రదర్! దేవుడు దిగొచ్చినా లాభంలేదు. నువ్వెంత? నీ ఫాదరెంత? నీ ఫ్రెండ్సు ఈ వెధవలెంత?

సుందర : నిన్ను చంపేస్తాంరా రాస్కెల్!

సత్యం : షటప్ ఇడియట్! నువ్వూ నీ ఫాదరూను, మీ ఫాదరని వాడి గురించి చెప్పుకుందికి సిగ్గుపడాలి నువ్వు.

సుందర : ఒరే!

సత్యం : మీ ఫాదరు... ...

కృష్ణ : ఒరే సత్యం! నువ్వు మితిమీరుతున్నావు.

సత్యం : మితిమీరి కొవ్వుబలిసి కండకావరంతో తిరుగుతున్నవాడు,– నేనుకాదు – వాడి ఫాదరు! వాడి ఫాదరు ప్రజాద్రోహి! పబ్లిక్ ఎనిమీ నంబర్ వన్.

కృష్ణ : ఒరే సత్తిగా! డేంజరస్‌గా మాటాడుతున్నావె!

సుందర : వీడీ రోజున సఫా !

సత్యం : కాని, వీడి ఫాదరు ఎంత పార్లమెంటుమెంబరయినా, ఎంతటి పెద్దపులయినా, అమాయక వ్యక్తికి ఎన్నాళ్ళు కళ్ళు ముయ్యగలడు? ఎన్నాళ్ళు బంగారు సంకెళ్ళతో బంధించ గలడు? స్నేహితులారా, ప్రియమిత్రులారా! ఇప్పుడా సుశీలని సుందరంగాడు సాకుతున్నాడు!

మధు : ఒరే సత్యం : ఏం మాటల్రా ఇవీ (అని గాభరా పడుతాడు)

కృష్ణ : హెూరి రాస్కెల్ !

సుందర : నే... నే... నేనా? మా పె పిన్నినా? సాకుతున్నానా?!! బాస్టర్డ్! ఏమిట్రా పేల్తున్నావ్?!!

సత్యం : నేను చెప్పేది నిజం! పరమసత్యం! సుశీల పిన్నిట, పిన్ని! సుశీల పిన్నిని సుందరంగాడు సాకుతున్నాడు.

మధు : ఒరే తప్పురా సత్యం!

సత్యం : నువ్వూరుకోరా రాస్కెల్! అమాయకత్వం వీలు చూసుకొని వీడి ఫాదరావిణ్ని పాడు చేసేడు. అమాయకత్వంలోనే ఇంకా ఆవిణ్ని ఉంచేడు. అది వీలు చూసుకొని మరొక డావిణ్ని బోల్తా కొట్టించేడు. బోల్తా కొట్టించినవాడు డాకూ నంబర్ వన్! వాడి పేరు సుందరం నంబర్ టూ!

సుందర : నేనా? పిన్నిని పాడు చేసేనా? యు హెల్ పే ఫర్ దిస్! శిక్ష శిక్ష! శిక్షనుభ విస్తావు. (సీసా ఎత్తి తాగుతాడు)

సత్యం : తాగిన వెధవలా మాటాడకు!

సుందర : నన్ను వెధవన్నావ్!! నేను ఆర్మీ ఆఫీసర్ని. మా ఫాదర్ గురించి, మా పిన్ని గురించి, నా గురించి, నువ్వు... నువ్వు...!

సత్యం : నీ గురించి నేనేం అనడంలేదు. లోకంలో లక్షమంది సుందరం గాళ్ళున్నారు. నీ గురించి కాదురా బ్రదర్ నే నన్నది.

సుందర : అన్నావు నిన్ను చంపేస్తాను.

మధు : మేష్టగారూ! సుందరంగారూ! తగ్గండి.

సత్యం : అరే సుందర్ భయ్యా! నీ పేరింటిగాడు మరో డున్నాడు.

వాడు చిన్న సైజు గుండా. ఛోటా గూండా వాడు. వాడు వేరు. నువ్వు వేరు.

సుందర: నాన్సెన్స్! నోర్మూయ్, స్కౌండ్రల్!

సత్యం: నీ పిన్నిని—నీ కావిడ పిన్నీ కాదు, గాడిదగుడ్డూ కాదు—ఆవిణ్ని నీ ఫాదరు మాయచేసి మోసం చేసేడు. అలాగ్గే వాడిప్పుడు మాయచేసి మోసంచేసి సాకుతున్నాడు.

మధు: ఆ మాటలు విత్‌డ్రా చేసీరా సత్యం! చేసేస్తాడండీ సుందరం గారూ!

సత్యం: విత్ డ్రా చెయ్యను.

మధు: చేసేరా సత్యం! నీకు వెయ్యి దండాలు.

సత్యం: నేను విత్‌డ్రా చెయ్యను.

మధు: చేసీరా బాబూ! నాయన్నాయన!

కృష్ణ: విత్‌డ్రా చేసీస్తే మాత్రం? లంజకొడకా అని తిట్టేసి లెంపలేసుకుంటే తీరిపోతుందా? తెలియకడుగుతాను.

సత్యం: నోరుమూసుకోరా తైరువెధవా! చంపేస్తాను.

సుందరం: వాణ్నా బెస్ట్‌ఫ్రెండ్! నువ్వు రాస్కెల్‌వి. నా 'ఎనిమీ'వి. శత్రువ్వి!

మధు: ఒరే విత్‌డ్రా చేసీరా! సత్యం! బాబ్బాబు!

సత్యం: షటప్! లెఫ్టినెంట్ అయితే నాకేం భయం అనుకున్నావా? లక్షమంది ఆర్మీ ఆఫీసర్లు నాకాలికింద బలాదూర్!

సుందర: (విస్కీ సీసా ఎత్తిపెట్టి గడగడతాగి) ఆఖరి సారడుగుతున్నా నోరే!

సత్యం: నీ ఆర్మీ ఆర్మీ అంతా నా కాలికింద బలాదూర్! నువ్వు నీఫాదరు నీ ఆర్మీ! అన్నీ, అంతా ఉఫ్ఫున ఊదేస్తాను. తోకలు పట్టుకు గిరగిర విసిరేస్తాను. డర్టీ డాగ్స్! బివేర్! ఖబడ్దార్!

సుందర: సత్యం!!!

మధు: ఒరే సత్యం, బాబూ బాబూ!!

సత్యం: నోర్మూయ్యండ్రా రాస్కెల్స్! మీరంతా రాస్కెల్స్! ఓత్తి రాస్కెల్స్!

సుందరం : చంపేస్తావ్రా ! నిన్ను చంపుతాను.

సత్యం : ఒరే సుందర్ ! నువ్వు మంచివాడివే. మీ ఫాదరు పాడుచేసే జ్ఞిన్ను. కొంతవరకూ|ఖాకీడ్రెస్సు పాడుచేసింది. మరి కొంత మటుకు ఈ వెధవ క్రిష్ణగాడు ఈ విషపు వెధవ పాడుచేసేడు. అంచేత అలాపాడయేవు.

కృష్ణ : "ఆఖరికి పింతల్లిని తగులుకున్నావు" అని ఆ మాటకూడా అను ! ఊఁ, అదికూడా అను ! భయపడతావేం ? అను !

సత్యం : నిజం అయితే చెప్పడానికి భయపణ్ను.

సుందర : నీకింక ఛాన్సులేదురా సత్తిగా ! ! చంపి తీరుతాను.

సత్యం : పోరా బేకూ ! నీతో నాకు మాటలేవిఁటి ? (అని పక్కకి నడిచేడు.)

సుందర : ఆగరా ! స్ స్ స్కాండ్రల్ ! ఆగు.

సత్యం : పోరా పోరా (అంటూ పక్కకి వెళ్ళిపోతాడు)

సుందర : (విస్కీ పూర్తిగా సీసాలోంచి ఖాళీచేసి, రెండో దాఁట్లోంచి కొంతతాగి, ఒక్కక్షణం ఇటూ అటూచూసి) ఆగరా స్ కౌండ్రల్ ! ఆక్క పో పో పోతే చ్చంపుతాన్ ! (అంటూ సత్యంవైపు పరిగెట్టేడు, చేతిలో విస్కీ బాటిల్ పట్టుకొని)

మధు : సుందరం ! మిస్టర్ ! మేష్టగారూ !

కృష్ణ : ఒద్దురా సుందర్ ! నువ్వేం అనకు. మీ ఫాదర్తో చెప్దాం. ఒరే సుందరం.

(అని ఇద్దరూ పరిగెట్టి ఆ పక్కనే ఆగిపోయి కళ్ళూ, చెవులూ మూసుకుంటారు. పక్కన విస్కీ సీసాతో తలమీద బలంగా కొట్టిన చప్పుడౌవుతుంది. పగిలిన సీసాపిడి చేత్తోపట్టుకొని, పక్కవాటుగా నడుస్తూ సుందరం తిరిగివస్తాడు. తలంట నెత్తురు కారుతూండగా "దొంగదెబ్బ ! దొంగదెబ్బ ! రాస్కెల్ ! రా ... రా ... రా ... రాస్కెల్ !" అని పక్కదాకావచ్చి సత్యం పడిపోతాడు.)

సుందర : బాస్టర్డ్! నీచవు వెధవ. చంపితీరుతాను!

కృష్ణ : సుందరం! ఏం చేసేవు? ఘోరం ఘోరం! రక్తం! సత్యం! ఒరే సత్యం! అమ్మో! నెత్తురు!

మధు : బాబూ బాబూ బాబూ! నే చూళ్లేను.

కృష్ణ : ఒరే సుందరం! రాస్కెల్ (అనిగట్టిగా ఊపి) ఏం చేసేవో తెలుసా? రక్తం రా! చూడ్రా చూడ్రా! అమ్మో రక్తం! వాటర్ బాటి లేదీ? ఏదీ ఏదీ? ఆఁ ఇదిగో! (అని వాటర్ బాటిల్లో నీళ్లని సీదాగా సత్యం ముఖంమీద పోస్తాడు. నీళ్లన్నీ పూర్తవగానే సత్యం కూడా పూర్తవుతాడు) ఒరే సుందరం! చచచచ్చిపోయేడ్రా! (దూరాన్న మిల్లుకూత వినపడుతుంది.)

సుందర : (చేతిలో సీసాపిడిని కింద జారవిడిచి తలపట్టుకుంటాడు.)

మధు : (మిల్లుకూత విని) అదేమిటి? ఎవరో ఏడుస్తున్నారు.

కృష్ణ : మిల్లు కూతరా, వెధవా! నువ్వేం గోల చెయ్యకు.

మధు : (వణుకుతూ) నేనేం చె చెయ్య లేదు. నాకేం తెలీదు.

కృష్ణ : ఊరుకోరా బాబూ! కొంప మునిగింది.

మధు : ఊరుకుంటాను. నాకేం కనిపించలేదు. నేనేం చూళ్లేదు.

కృష్ణ : నేనూ ఏం చూళ్లేదు! మనకేం తెలీదు. ఇక్కణ్నించి పోదాం! రారా సుందర్! రా పోదాం!

సుందర : సత్యం, సత్యం! సత్యం ఎక్కడ?

మధు : ఏమయేడో ఏమిటో నాకేం తెలీదు. నే పోతాను. నేను పారి పోతాను. (అంటూ కదలబోతాడు.)

కృష్ణ : ఎక్కడకి పోతావురా, వెధవా! ఆగలాగ!

మధు! మా అమ్మ బెంగపెట్టేసుకుంటుంది. ఇంటికి పోతాను.

కృష్ణ : కదిలేవంటే చంపేస్తా నొరే!

మధు : వెధవా! నువ్వే అంతా చేసేవు!

సుందర : ఏఁ విఁ టి? ఏం జరిగింది? సత్యవేఁడీ? అదేమిటా నెత్తురు! సత్యవేఁ? నేనే చంపీసేనా? నేనే?? చంపీడవేఁ???

మధు : గట్టిగా అనకండీ బాబూ బాబూ (అంటూ మళ్ళీ చెవులు మూసుకుంటాడు.) ఇంటికి పోదాం రా క్రిష్ణా ! ఇప్పుడెలాగ ? అరు మైళ్లుంది. ఎలా వెళ్లడం ?

సుందర : గుడ్ గాడ్ ! గుడ్ గాడ్ ! ఘోరం ఘోరం ఘోరం చేసేను.

మధు : నాకు డ్రైవింగ్ రాదు. ఎలాగ ? సుందరంగారూ ! కారెక్కండి. పోదాం పోదాం !

కృష్ణ : (వాటర్ బాటిల్ కిందని పడేసి) వాడిప్పుడు ఏ చెట్టుకో పెట్టేస్తాడు.

మధు : మరైతే ఎలాగరా బాబూ ! ఎలాగండీ సుందరంగారూ !

సుందర : నన్ను మాటాడించకండి. నన్ను మాటాడించొద్దు.

కృష్ణ : సుందరం సుందరం ! పోదాం వేగిరంరా ! రారా మధూ పోదాంరా ! నే డ్రైవ్ చేస్తాను. రండిపోదాం.

మధు : నీకు డ్రైవింగొచ్చా ? ! అమ్మ బతికేం. రండిపోదాం అయితే ! సుందరంగారూ ! మేవేం చూళ్లేదు. ఇక్కడికి మేం రాలేదు. మాకేం తెలీదు. రండిక పోదాం.

సుందర : ఎక్కడికి ? స్టేషన్కా ? పోలీసులకి నన్నప్పచెప్తారా ? గుడ్ గాడ్ ! నేరాను.

కృష్ణ : అక్కడక్కాదురా వెధవా ! ఇంటికి పోదాం ! మీ ఫాదర్తో అంతా చెబ్దాం. ఇంటికి రా ! కారెక్కిపోదాం ! రా !

సుందర : మా ఫాదరు ఊళ్ళోలేడు. నేరాను. రాన్రాను.

కృష్ణ : ఈపాటికి రావాలి. మీ ఫాదరూ మా నాన్నా ఇద్దరూ కలిసే వెళ్ళేరు. మధ్యానం ఒస్తావన్నారు. ఈపాటి కొస్తారు. రా ! వెళ్దాం. పదరా మధూ ! రారా సుందరం ! ఆయనంతా సరి చేస్తారు ! రండి !

(అమ్మో అమ్మో అనుకొంటూ మధుసూదనరావు, గుడ్ గాడ్ అనుకొంటూ సుందరరావు రెండో పక్కకి నడుస్తారు. వాళ్ళ

వెనకనే కృష్ణారావుకూడా వెళ్ళి మరొక అరనిమిషం పోయేక తిరిగి తొందరగా వచ్చి, వాటర్ బాటిలూ, తుపాకీ, ఒక విస్కీ సీసా తీసి పట్టుకుంటాడు. పట్టుకుని తిరిగి తొందరగా వెళ్లి పోతాడు. తరువాత మళ్ళీవచ్చి సోడాబుడ్లూ టంబ్లర్సూ పట్టుకు పోతాడు)

# 2

సార్వభౌమరావు ఇంట్లో అతని పడకగది. పందిరి మంచం ఉంటుంది. గోడని ఒక నిలువుటద్దం, ఒక గోడగడియారం ఉన్నాయి ఒకవార బీరువా ఒకటుంది. ఎడమపక్కని మరో గదిలోకి ద్వారం ఉంది. కుడివైపున ఈ పడకగదిలోకి పైనించి ప్రవేశం ఉంది. గదియొక్క మిగతా అలంకరణంతా ధనికులూ, సరసులూ అయినవారి పడగ్గదుల అలంకరణలా ఉంది. ఒకవార మేజా, దానిపక్క రెండు కుర్చీలూ ఉన్నాయి ఒక వాలుకుర్చీ కూడా ఉంది. మేజామీద ఫోన్ ఉంటుంది. సమయం సుమారు పన్నెండుగంటల సమయం. పన్నెండింకా కొట్టలేదు.

పైనుంచి పడగ్గదిలోకి, ఏదో ఆలోచిస్తూ ప్రవేశిస్తుంది సుశీల ఆమె వెనకనే సోమసుందరరావు పిల్లిలా అడుగులు వేస్తూ వచ్చి ఆమె కళ్ళు మూస్తాడు. మూసినచేతులు తీసేడానికి ఆమె ప్రయత్నిస్తుంది.

సుశీల : (తుళ్ళిపడి) ఎవరు? ఎవరు?? (అని చేతులు తీసేడానికి ప్రయత్నిస్తుంది.)

సోమసుందరరావు : చెప్పుకోవాలి! (నెమ్మదిగా, గొంతుక మార్చి అంటాడు.)

సుశీల : (మూసిన చేతుల్ని బలంగా లాగేసి, సోమసుందరరావు వైపు తిరిగి క్షణం నిర్ఘాంతపోతుంది. తరువాత గాభరా పడుతుంది) సుందరం!!

సోమ : ఏవిఁటూ గాభరా? సుశీల్ని చూడ్డానికొచ్చేడు సుందరం! ఏం? రాకూడదా?

సుశీల : వేగిరం వెళ్లిపో!!

సోమ : సుశీలా! ఇవాళ నిన్ను తీసుకుపోడాని కొచ్చేను. నువ్వు లేన్ది నే వెళ్ళను.

సుశీల : వేగిరం వెళ్లిపో సుందరం!

సోమ : వెళ్ళను.

సుశీల : ఇప్పుడాయనొస్తారు.

సోమ : ఎవడొస్తాడు?

సుశీల : బావగారొచ్చేస్తారు. వెళ్లిపో వేగిరం. ఆయన రాకముందే వెళ్లు! వెళ్ళవా?!

సోమ : బా-వ-గా-రు! ఇదిగో సుశీలా! ఏడాదయింది. ఇంకె న్నాళ్ళు దాస్తావ్? దాస్తే అది న్యాయంకాదు. వాడు మంచో డన్నావు. సరే ఒప్పుకున్నాను. మంచోడికి అన్యాయం చెయ్యడం మరీ మంచిదికాదు. ఇవాళ నిన్ను తీసుకుపోడాని కొచ్చేను. ముసిలాడితో ఇవాళ చెప్పి. "ఇదిగో! సర్వభౌం రావుగారూ, బావగారూ! నువ్వంటే నాకు విస్వాసం ఉంది కాని ప్రేమలేదు. అంచేత ఇదిగో మా సుందరంతో వెళిపోతు న్నాను" అని చెప్పి! దాగుడుమూతలెన్నాళ్ళు? నువ్వు చెప్ప లేకపోతే నే చెప్పేస్తాను. రానీ, ముసిలాణ్ణి రానీ! అందాకా నే వెళ్ళను (అని జోళ్ళు విప్పేసి మంచంమీద కూర్చుంటాడు.)

సుశీల : ఒద్దు సుందరం! ఒద్దొద్దు. ఇప్పుడుకాదు. తరవా చ్చెప్పొచ్చు. నన్నల్లరిపెట్టకు. నీకిది న్యాయంకాదు. నేనొస్తాను. తప్పక వస్తాను. ఇప్పుడాయన్తో నే చెప్పలేను. నువ్విక్కడ కూర్చొని నా పీకలమీదికి తేకు. నా మాట మన్నించు. సుందరం! వెళ్లు!

సోమ : (మంచంముందున్న స్టూలుమీద విప్పిన జోళ్ళు అక్కడే అలాగే వదిలేసి, మంచంమీంచి లేచి) సుసీలా! నీ మాటలు వింటూంటే నాకలా వినాలనే ఉంటుంది. విన్నాక మరి నీ కెదురు చెప్పలేను.

సుశీల : సుందరం! వేగిరం వెళ్ళిక్కణ్ణించి, నీకు పుణ్యం ఉంటుంది. ఆయనిప్పుడొచ్చేస్తారు. నా మాట విను. వెళ్ళిపో! నీకు కాలేజీ లేదా? కాలేజీకి వెళ్ళిపో! చదువిలా ఎగ్గొట్టకూడదు.

సోమ : కాలేజీలేదు, గీలేజీలేదు. నీతో అన్ని సంగతులూ చెప్పేద్దామని వచ్చేను. ఇష్టం ఉంటే ఒద్దువుగాని లేకపోతే లేదు. మాట్లాడ్డానికైనా నాతో రా ఇప్పుడు.

సుశీల : ఇప్పుడుకాదు. ఇక్కడొద్దు. నువ్వు కాలేజీకి వెళ్ళిపో!

సోమ : ఇవాళాదివారం. కాలేజీ ఉండదుకద. అయినా నాకు చదువొద్దు, నాకది రాదుకూడాను. నిజం చెప్తున్నాను.

సుశీల : అలా అనకు. చదువుకో. వెళ్ళు! వెళ్ళు బాబూ!

సోమ : చదువున్నా లేకపోయినా నాతో ఒచ్చేస్తావా?

సుశీల : ఒస్తాను తరవాత మాటాడదాం. ఇప్పుడు వెళ్ళిపో!

సోమ : (నవ్వుతూ) సెబాస్! ఒస్తావా?! మరి నువ్వుంటే నాకు చదువక్కర్లెదు. "చదువూ! నీకు గుడ్‌బై! టాటాలలా" అంతే! మా ఫ్రెండు జానీగాడున్నాడు...

సుశీల : సుందరం:

సోమ : ... వాడికి లాటరీ బల్లుంటే పెళ్ళాం కూడా అక్కర్లేదు. అలా, నువ్వుంటే నాకింకేం అక్కర్లేదు. నువ్వు నా లాటరీ బల్లవి!

సుశీల : సుందరం! పోలిపిల్లి వింటాడు. ఒస్తాడో ఏమిటో?

సోమ : వాడెవడు? మీ నౌకరేనా? ముసిలాడు ముందు వరండాలో పడుకున్నాడు. మరేం భయంలేదు.

సుశీల : కాసేపట్లో బావగారొస్తారు. వచ్చే వేళయిందప్పుడే:

సోమ : ముసిలాడు నీకు బావెలా అవుతాడు? పెంచినవాడు తండ్రి అవుతాడు. పెళ్ళాడేవాడు బావవుతాడు. వాడు కాదు నీ బావ నేనూ!

సుశీల : సుందరం! మెల్లిగా, మెల్లిగా మాటాడు.

సోమ : (మెల్లిగా) నువ్వు నా లాటరీ బల్లవి. నా కోవా బిళ్ళవి. నా జున్ను ముక్కవి.

సుశీల : ఆయనొచ్చేస్తారు. ఏమిటీ మాటలు!!

సోమ : నువ్వు జమునాకీ రాణివి! నేను రాధాకా రాజుని! నేనిస్పేటానుని! నువ్వు ఆ తీను రాణీవి!

సుశీల : సుందరం! ఏఁవిఁటీ రౌడీ మాటలు!

సోమ : నేను రౌడీల రాజుని, రాపోదాం! ఇన్నాళ్ళూ రౌడీల రాజునే! కాని మరింక అలా ఉండను. ఇప్పుడే పోదాం. నీ కోసం మారిపోతాను. ఉద్యోగం చూసేను. రేపు ఫస్టుతారీకు నుంచీ స్టార్టింగ్!

సుశీల : ఉద్యోగం ఏఁ విఁ టీ? ఎవరికి?

సోమ : నాకే! ఇన్నాళ్ళూ బేవార్సుగా తిరిగీసేను, ఇప్పుడింక అలాక్కాదు. మెకానిగ్గా పనిచెయ్యగలను. చేస్తాను. రేపుఫస్టునించీ రెడీ బాటరీలో ఉంటాను.

సుశీల : మెకానిక్ ఏఁవిఁటి? రెడీ బేటరీ ఏవిఁటి? చదువుకోవా ఏఁవిఁటి?

సోమ : చదువుకోను. నువ్వంటే నాకు చదువక్కర్లేదు. రా పోదాం. రా వేగిరం! సుశీలా, రా! ఒస్తా నన్నావు. రా. రఁయ్ఁ మని ఎగిరి పోదాం. రా!

సుశీల : ఎగిరిపోదాం. ఇప్పుడు కాదు. అసందర్భంగా మాటాడకు. తరవాత మాటాడుకుందాం.

సోమ : ఎప్పటి కప్పుడు అలానే అంటున్నావు. ఏదీ తేల్చవు. ఇప్పుడిప్పుడు, ఒచ్చేస్తా నన్నావు. మళ్ళీ ప్లేటు ఫిరాయిస్తున్నావు. సుశీలా! రా! ప్లేటు మార్చకు. రా నాతో.

సార్వభౌమరావు : (ఇంట్లో, కొంతదూరం నుంచి) అప్పన్నా! నూకరాజూ! ఎక్కడర్రా, రాస్కెల్స్!!

సుశీల : చచ్చేను. ఆయ నొచ్చేరు!!

సోమ : నాతో ఒచ్చి!

సుశీల : అమ్మో! రాను! నువ్వెళిపో! నా మాట విను! నన్ను చంపేకు!

సోమ : రావా?

సుశీల : రాను. తరవాత మాటాడదాం.

సోమ : రావా ? నన్ను చూస్తే ఇష్టవేఁ నన్నావు ! రా సుశీలా !
సుశీల : వేగిరం వెళిపో బాబూ !
సోమ : రావా ? నాతో రావా ?
సుశీల : రాను.
సోమ : ముమ్మాటికీ, రావా ?
సుశీల : రాను. ఇప్పుడ్రాను. అయనొచ్చేసేరు. సుందరం !
సోమ : హాయిగా ఉండొచ్చు. రా పోదాం. ఒస్తానన్నావు ! రా పోదాం.
సుశీల : ఇప్పుడు కాదు.
సోమ : ఇప్పుడు అటో ఇటో తేల్చుకో లేద్దానివి మరెప్పుడూ తేల్చుకో లేవు. నామాట విని నాతో ఒచ్చి ! నీ కోసం మంచివాణ్నవుతాను. రా పోదాం ! ఇక్కడుండొద్దు. రా పోదాం ! నేనంటే ఇష్టవేఁకదా ? మరి రాపోదాం ! సుశీలా రాపోదాం ! పని చెయ్ అంటే పని, చదువుకో అంటే చదువు – ఏచ్చెయ్యమంటే అదే చేస్తాను. రాపోదాం ! నువ్వు ప్రేణాలిమ్మంటే రైట్ కరెక్టనేసి ఇచ్చేస్తాను. రా పోదాం ! సుశీలా, రా పోదాం రా ! సుశీలా ! !
సుశీల : వెళ్ళిపో సుందరం, నామాట విను. ఆయనొచ్చేస్తారు.
సార్వభౌమరావు : (ఇంకా దూరంనించే) సుశీలా !
సుశీల : అరుగో ! !
సోమ : రావా, అయితే ?
సుశీల : నాకేద్దారి ? ? ఎలా ఇప్పుడు ? ?
సోమ : రావుకదూ, సుశీలా ?
సుశీల : రానురాను ! రాను.
సోమ : ముమ్మాటికీ రావుకదూ ?
సుశీల : తరవాత మాటాడదాం. ఇప్పుడ్రాను.
సోమ : తరవాత మాటాడతావు. ఇప్పుడు రావు. అంతేనా డార్లింగ్ ! నీకీ మేడా, ఈ గదీ, ఆ పరుపు – ఇవి కావాలి. అప్పుంటేనే నేను కావాలి. ఏం అంతేనా ?

